# రత్నాకరము

## ( గీతికా సంవాదము )

తల్లావఝ్ఝల
శివశంకర శాస్త్రి

సాహితీ సమితి
సికందరాబాద . హైదరాబాద

# పూర్వ భాగము

(సంధ్యాసమయము. అలంకరించి యున్నగదిలో తల్పముమీద శ్రీమర వంటుకొని యుండును. ఆమెసఖి శాంత ప్రక్కనున్నది.)

శాంత

ఏల వినిపించుకో వీయాప్తజనవాక్కు ?
నీకోపమ్మై మేము సెగులుపాలైతిమే ;
ఓ చెలీ, ఓ చెలీ, ఊర్పుతావులె కాని
పలుకుతేనియ చినుకు చినుక వేమే చెవుల ?

ఓసఖీ, ఓసఖీ, ఊరకే నావైపు
శూన్యదృక్కులతోడ చూచుచున్నా వేమె ;
వింతవర్తనముచే వెర్రి యేమో యన్న
శంక మామతులలో జనియించుచున్నదే ;

ఓచెలీ, ఓచెలీ, ఒకకొంత తడ వేలొ,
నవ్వితివి జాలిగా నామోము వీక్షించి.

నిర్నిమేషమ్ముగా నింగి నవలోకించి
మరికొంత తడవునకు మందస్మితాస్యవై
ఓసఖీ, ఓసఖీ, ఒత్తిగిలి యొకవైపు
గాత్రవల్లిక స్వయంగ్రాహమ్ము చేసితివి ;

నెచ్చెలీ, నెచ్చెలీ, నీగభీరస్వాంత
రత్నాకరమ్ములో రాజుచున్నది కీలి :
మౌనముద్రిక వీడి, మర్మమ్ము విడనాడి
నీవ్యథం దెలుపవా నెచ్చెలీ, నెచ్చెలీ :

పలుకవా పలుకవా, పాటలాధరదీప్తి
నంతర్హితము సేయ నగునె యాస్యమ్ములో ?

నీలాలకవల్లికా నిచయమ్ము నెచ్చెలీ,
చెక్కిళ్ళలోయలో చిక్కువడ్డది సుమీ :
నా సఖీ, నా సఖీ, నగుమోము నెలవంక
కాలధారాధరాక్రాంతమ్ము కా నేల ?
ఆదిత్యభగవాను డస్తమించుట జేసి
ముకుళించెనా నీదు ముద్దుకమ్మతామరల్ ?

చూడవే చూడవే శోభామయం బైన
ఉద్యానవనవాటి నోచెలీ, ఓచెలీ :

మరకతోన్నతపీఠి మల్లె యారోహించి
ఓలగం బున్నదే యుద్యానసీమలో.
చూడవే చూడవే, శోణకుడ్మలకంబు
కంటకాంకితకోమలాంగి గాచుచున్నది వనిని.

జాలమార్గమునుండి చల్లగా మెల్లగా
మలయానిలమ్మది సఖీ, సుందరవనమానమును.

# పూర్వ భాగము

విడువవే, విడువవే, విడువవే తల్పంబు,
విరిసెజ్జపై చెలీ, విశ్రమింతువు గాని.

ఒంటిగా గూర్చుంద ముపవనమ్మున మనము:
నీ మనసులో బాధ నిమ్మళించును కొంత.
ప్రియసఖీ, ప్రియసఖీ బిగువు విడువవె యింక,
భాగించుకొందు నీ బాధ యేదో గాని.

పలుకవా పలుకవా, ప్రాణాధికవు నిన్ను
విసిగింప కిక నైన వెడలిపోదును గదే!
కనుదోయి దెరచి నన్ గనుగొని పలుకవ
విశ్రమించెదుదాన నెచ్చెలీ నెచ్చెలీ!

భ్రమర

( లేచి, తల్పముపై గూర్చుండి )

ఏది చనబోకు మీవేళ నను ప్రియసఖీ!
తాళజాలక తలపుతరగ గమితాకులకు
వెతల పాలైన యీవేళ దుర్బలహృదయ
ఏది....

మనసులోని సముద్రమథనమ్ము ప్రియసఖీ,
తెలుప చెలుతో నాకు తెలియకున్నది గదే
ఏది....

అమరాగవతి యైన అమ్మ కీవరలోనె
కొలదిగా నామీద కోవరేఖలు కలవు
పీడి....

శోభించి శోభించి శుద్ధజీవితముపై
అంతంత మాత్రమే ఆసక్తి మిగిలినది
పీడి....

శాంత

( తర్జని నోటిపై నుంచికొని )

అశుభవాక్కులు నోట అనుచితము రానిచ్చు
టైన వెగ కేల చెపుమా,
ఓ చెలీ, అపుడె జీవనలీలపై ?

ఆరోగ్యవతివి నీ వాహ్లాదము త్యజించి
ఐతుకుపై రోసినావే
ఓ చెలీ, ప్రథమ యౌవనమువందే ?

కావ్య నాటక కథాగ్రంథజాలము తెరవ
కవిశమ్ము పర్యంకమే
ఓ చెలీ, ఆశ్రయించెద వేటికే ?

మనసులో దిగులుచే మధనపడు చీరీతి
ఊరకే కృశియింతువా, ఓ చెలీ,
ఉచిత మేమో చూడవా ?

## పూర్వ భాగము

గుప్తి యేటికి? నీకు గూర్చుదానను గదా
ఎవనిపోవగ నేటికే, ఓ చెలీ,
నాకు వివరింపరాదే!

### భ్రమర

(దీనముగా చూచుచు)

నీవే నాకు, నీవే నాకు
నావవు దుఃఖనదిని గడవ....నీవే....

చింతాక్రాంత చిత్తమునందు
సడలిపోయెను సహజ పటిమ....నీవే....

తేకువ యెట్లా తెచ్చుకొమచు
తెలుపుదు మనసుతెరగు చెలీ!....నీవే....

ఆదిని నాకు అభయహస్త
మొసగ వలయు ఓరిమితోడ....నీవే....

అలుక పూనవలదు నాపై:
చెలీ, అపుడు చెప్పగల్గుదు....నీవే....

హేయభావ మెంతమాత్రము
చెలీ, నాపై కలుగ రాదు....నీవే....

శాంత

( శ్రీమరమ కౌగలించుకొని ముద్దాడి )

న న్నిపుడైనను నమ్మవె ప్రియసఖి !
ఏటివలుకు లివి ! షేయ్యబావనా
ఎవ్వడు గాని ఏగతి గలుగును....న....

ఏకయి చెలియా, నే నెటి యైనన్
వింతు మనసుతో నెరవేర్తుమగా....న....

ఏది హితమొ వీ, కేయది సుఖదమొ
శ్రీమ మని యెంచక నమక్ష్మార్తుమగా....న....

తనువులు రెండుగ కనబడుచున్నను
అంతరంగముల నద్వయరూపమె....న....

శ్రీమర

అమ్మ శ్రీమ్మర నమ్మ ఆత్తవారింటికే
పొమ్మనుచు పలుమారు పోరు పెట్టుచున్న
దేమి చేయుదు సఖీ, ఏది మార్గమ్ము నాకు !

నా మదికెప్పై శాంతి నలున ప్రియనె లేదు !
దీర్ఘ జీవితము నేతెరగున న్గడపుదును !
ఏమి....

అమ్మ కెప్పుడు లోక మన్న భయమే కావి
పుత్రికా హృదయంబు పొగిలిపోవుట యెరుగ
డేమి....

అనురాగ రహిత మైనట్టి కాపురము నే
చేయ లే నని చాల చెప్పి యేడ్చితి నెంతొ
ఏమి....

అగ్నిహృదయం బున్న. అధునికహృదయాల
అనురాగ విధ మేమొ అమ్మ యెరుగనె యెరుగ
దేమి....

అచటి కేగుటకన్న ఆత్మహత్యయె మేలు !
పడలేను, పడలేను బాధ లీపయి నఖీ !
ఏమి....

శాంత

పోవలదు లే అచటి కింక - అమ్మ
ఘోర దీపయి విడువు శంక.

పసిపవకోమల మైనయెడద - ఏది
బాధ పెట్టిన మొదలె చెడద !....పోవలదు...

యమయూతనలు మరల వలదు—నీకు
అమ్మనన్నిధి శాంతి కలదు—ఆమె

వేరుగా భావింపబోదు—మదివి
వెత నీవు పెట్టుకోరాదు....పోవలదు....

ఉల్లాసకర మైన వింట—చెలియా,
ఉన్న వెన్నో—నేను జంట... పోవలదు....

భ్రమర

(ఈషదుత్సాహముతో)

అవును సఖీ, అవును సఖీ,
అమృత తుల్యవాణి సఖీ,
కాని నీవు జీవితమున
కష్ట మెరుగ లేవు సఖీ....అవును....

అనుకూలం బైనట్ర
ఆదరించుచుండ నిన్ను
ఎటుల విదిత మగును నీకు
ఈ హృదయజ్వాల సఖీ....అవును....

జీవన మరుభూమిలోన
చింతతోడ రగిలి రగిలి
శోషణమ్మె కాంతు గాని
సుఖ వర్షిపలు కానబత్తునె? .. అవును....

పరికృత స్థితియందు పిరత
బాధ పడుచు నుంటె కాని
ఇచటగూడ శాంతి లేదు!
ఏమి చేయ దగును సఖీ!....అవును....

శాంత

గతముకన్న నీకు భావి
కాలము తిరుగుబమ్మ పిదా?
జీవయాత్ర యేవిధాన
చేయగలవు ప్రాణసఖీ!

పుట్టినింట నైన శాంతి
పొందజాల వేవి చెలీ.
ఎచట సుఖము కలదు నీకు?
ఎవరు కూర్చువారు కలరు?

నీయవస్థ గాంచుకొలది
నింపుదుఃఖ ముదయ మొందు.
సౌఖ్య మొందు మార్గ మేది
జన్మములో ప్రాణసఖీ!

భ్రమర

అట్టితోవ దొరకునేని
అవరోధము చూపవుకద?

శాంతి గాంచునేమి సఖీ.
నమ్మకంబె కదా నీకు ?

అమ్మతోడ జెప్పవు కద ?
ఆవల నన్ను నిరుత్సాహ
పంకమందు ద్రోయవు గద
ప్రాణసఖీ. ప్రాణసఖీ !

శాంత

చెలియా, నీ వింతగా చెప్పగా వలెనె ?
అమ్మకు నీవార్త ఆవంతయేని
కర్ణగోచర మేల కావలె నోసి !

గుప్తముగా నుంతు క్రొత్త వృత్తాంత,
మెరిగింతు నిజముగా హిత మేదా నీకు,
చూచి సంతోషింతు సుఖ మబ్బునేమి.

భ్రమర

చూచినా వొకనాడు శుభముహూర్తమునందు
రమణీయ మహాత్మరత్నాకరం బొకటి.
గాంభీర్యధామమ్ము. కాని భయదము కాదు.
లావణ్యనిధి యయ్యు లవణార్ణవము కాదు.

అమృతకలశమే. కాని హాలాహలము లేదు.
పవనాహతికి తుంగతరంగముల్ రేగవే!

అస్పర్శచేత నే నఖిలచింతలు వాసి
ఆనందమూర్తినై అమృతంపు దీవినై
రత్నపత్రికల వెల్గి రమణీయరూపాన
రత్నాకరమ్మునై రంజిల్లుదును సఖీ!

శాంత

కాంచియుందువు చెలీ, గౌతమీ ద్వార
రమ్యదేశమునందు రత్నాకరమ్ము.
అరుగుదెంచిన దాది అచ్చోటనుండి
నెచ్చెలీ, నెచ్చెలీ, నీలోనిమార్పు
అంత కంతకు నాకు అవగతం బయ్యె.
మరుగుచేసితి వేకొక్క మానసకాలమ్ము
విభ్రమముగ చెలీ, నీరహస్యమ్ము!

ప్రణయ శృంఖ[illegible]లు ప్రతిధ్వనించునుండి
విడువకుండ క్రొ[illegible] [illegible] [illegible]!

భ్రమర

అపరిచితము శ్రీ[illegible] ఓ కాంతా.
అభిజనుల బోధన ...

కుట్టిమము వేదిపై ఓ శాంతా
కూర్చుంటి వదినతో ..

ఆయింటి భామినుల కో శాంతా
అప్తురాలట వదిన ..
కుశల మడిగిన పిదప ఓ శాంతా
గోష్ఠి చేసిరి వారు. ..
వే వరధ్యానముగ ..
వింగి కాంచుచుమంటి ..
చూచుచుండగ వట్టు ..
సూర్యకాంతులు పడిన వో శాంతా
మస్తకమ్మును త్రిప్పి ఓ ..
మరల కన్నులు విప్ప ..
ఆవిర్భవించినది ..
అఖిలవాకారమ్ము ..

శాంత

( బుజము తట్టి నవ్వుచు )
అంత యఖిలవ మైన ఆకార మొక్కొ
దిగ్భ్రమ పుట్టించు దివ్య తేజంబొ ।
పురవిహారములం దపూర్వ మైనట్టి
మోహనాకృతి గాంచి ముగ్ధ వైనావొ ।
( తేరిపార జూచుచు )

## భ్రమర

(ముసి ముసి నవ్వుతో)

అట్టాలకమునుండి ఓ కాంతా
ఆపురుష విగ్రహము ,,
వాల్చి విజిశీగ్నమ్ము ,,
వంపు సోపానములు ,,
దిగుచుండు సమయాన ,,
తిలకించినా నమ్ము ,,
చివర సోపానమ్ము ,,
చేరినంతనె నన్ను ,,
విప్పుకన్నులతోడ ,,
వీక్షించె ఆమూర్తి ,,

## కాంత

ప్రధమ వీక్షణమందె యాతడు
భ్రమర కీటం బైన వ్యాయము
చెప్పుచున్నవి జాజువారిన
చెక్కుటలు చెలియా!

## భ్రమర

తెలియకుండగ నాకె అయ్యెడ
దేహ మెట్లో లేచి నిలిచెను

వేదికాస్థలినుండి నెచ్చెలి.
వేగిరం పరుచు.

ఆవల నాతడు మెల్లదరిగా
ఆనవతానన డగుచు కుట్టిమ
మార్గమున నరుదేరసాగెను
మందగమనమునన్.

నిశ్చయము లేదెమో. లజ్జయో !
నిండుదృక్కులు నిలువజాలక
చూచితివి కడగంట నాతని
శుభ్రవదనంబున్.

నాలు గడుగులు వేసి యాతడు
నన్ను గనుగొని వెతడ కన్నుల.
శిరము వాలిచి పోవసాగెను
శ్రీహరి గమనమునన్.

శాంత

( ఉత్సాహముతో )

అప్పుడ పకియా. అతిథితో చను
డగుడ గాక. ద్వితీయాకారము

విలవగలుగునె కాంచకుండగ
నీముఖాబ్జంబునన్ !

భ్రమర

అదియె వల్లభు నామధేయము !
అతఃణంబున నాకమంగవ
కలిసిపోయిన దెట్లొ ఆయన్న
కలువ కన్నులలో.

నావమీవద్వార సరణి
వడచి లోనికి బోవు నదిగో
వరపె నాపై నతడు దీర్ఘా
పాంగ వీక్షణమున్.

సఖియ, క్రిమ్మర వజ్రితేక
స్థగిత వేదికమీద నుదకే
ళించితివి జనియించ వలబడి
చిత్తకుంజములో.

శాంత

( వక్రిముగా జూచి చిరునవ్వుతో )

విన్న జూడగ మరలనోకో
వెవముపై వరుదెంచినాడా !

అన్యథా యెటు లగుమ చెలి, నీ
వయస్కాంతమవు.

భ్ర మ ర

తిరుగ రాలే దతడు చెలియా.
ధీరచిత్తుని భాతి దోచెను.
యువతి గనుగొనినంత మాత్రన
ఒడలు మరచు నొకో :

కట్టుకొని యున్నాడు సకియా.
పట్టుకమ్మల దుకూలమ్మును
విడిచి చెంగులు, వింతనడకను
వింత లీవలగా.

తాల్చియున్నా డర్ధబాహుల
ధవళ కూర్పాసమ్ము చెలియా.
తొంగి చూచుచుండ వక్షో
ద్యుతులు కుతుకమునన్.

ఆమనోహర దీర్ఘ బాహువు
లందు లతికాశోభ కూడునా
కూడదో. మరి వాతుమాత్రము.
గోచరించినదే.

శాంత

బాగు బా గోపి ప్రియసఖీ, ఆ
బాహులతికలు నీ తనూలత
నల్లిబిల్లిగ నల్లుకొను లే
అచిర కాలములో।

( భ్రమర సిగ్గుతో లేచి, వాతాయనమున
గూడుచుండి, ఉపవని నువలక్షించును )

ఏది, ఇంచుక తిరుగు భ్రమరా,
ఈ కఠోర హిమాంశు రుచిలో
తేజరిలుచున్నావు గిరిజా
దేవి చందమునన్.

ఆ త్రిలోచనమూర్తి పీనయ
నామృతోర్మ్మల దేలియాడుచు
చెలియ, నీపదపట్టభంగ
శ్రేణి జేరును లే।

భ్రమర

( గంభీర వదనముతో )

అంత సులభం బైన దని తలంపగ రాదు।
అది కాక ప్రియసఖీ, ఆపదద్వయి జేరి
జీవితము సఫలమ్ము చేసికోవలె నేనె.

గ్రహియించితివొ లేదొ కాని నావల్లభుడు
చూడగా చూడగా సులభసాధ్యుడు కాడు.
ఉత్తమాన్వయమునం దుద్భవించినవాడు
సుగుణాలలో తనూశోభ కలిగినవాడు.

శాంత

అంత గుణవంతుండు కావున
ఆ త్రిలోచన పుత్రగణపతి
భ్రమరికా కుచకలశవారి
బద్ధు డయి పోవున్ !

భ్రమర

( వచ్చి తల వంచుకొని )

ఆనాడు మొదలుగా అన్యోన్య వీక్షణము
వసకాలముదాక ప్రాప్తించనే లేదు.
గమనించి యొకనాడు కంతస్వరమ్ము వేనె
దూరమ్మువందుండి తొంగి చూచితి ప్రియుని.

నిర్విశేషమ్ముగా [illegible] కష్టల్ము.
క్షమమ్ముగా నుండె గండఫలక ద్వయమ్ము.
చెదరి యున్నది కేశ[illegible]మ్ము విడి విడిగ
పావు. మాతడు [illegible] తోచె.

కాంత

చెప్పనేటికి యింక వేఱుగ
చెలియ, నీపై రక్తి చేతనె
మౌనముగ కృశియించినా డా
మానవోత్తముడు !

భ్రమర

కాదు కాదే, కొంతకాలమ్మునకు గావి
అంకురింపనె లేదె అనురక్తి నాధునకు.
ప్రశ్నించినా డంట ప్రథమ పర్యాయంబు
నే నెవ్వ రని వధూనిక గాంచి యొకవాడు.

మాటమాటల నడుమ మరల నావృత్తాంత
మడిగినాడట చెలీ, ఆ మీద నొకసారి.
మరియొక్కసారి యీమందభాగ్య భవిష్య
దాశాదులనుగూర్చి అడిగినాడట చెలీ !

పోవుచున్నార మీపురిమంది త్వరలోనె
అని వధూనిక తెలుప ఆననమ్మున కళల్
తరిగిపోయిన వంట తక్షణమ్మే పక్షి !

శాంత

( మృదువుగా చపేటిక వేసి )

సంశయాత్మకురాలం, ఆతని
స్వాంత మతి వేలమ్ముగా నీ
లలితరూప విలాసవాగుర
లగ్న మైతో యేన్.

భ్రమర

ఎదట వడివడి మనసు, కోర్కె లీరిక లెత్తె.
సాహసోద్దీప్తమై సారెసారెకు నేనె
నిర్భరమ్ముగ నాదు పింఛచూపులతోడ
కనుగొంటి హృదయేశు కనులకరవే తీర.

ఆదిలో వల్లభుం డాలోల నేత్రాల
వీక్షించె వెచ్చలి. ఈషత్త్రపారేఖ.

వెడదకన్నులతోడ వీక్షించె నావలను.
అనవమ్మువ మందహాసాంకురము తోచె.

అవివాహితుడు ప్రియుం డన్నవృత్తాంతంబు
కర్ణకుహరము సోకగా దెల్పెనది వదిన.

## శాంత

దావకార్త్తాంత లోచన
ధాళధళ్యముచేత నాతని
వజ్రపంజర సన్నిభం బగు
స్వాంత మానాడే-

కరగి క్రమముగ పూవుదేనియ
కరణి సారళ్యంబు మధురిమ
సంక్రమింపగ త్వన్ముఖమ్ముగ
జాలు వారెనులే!

## భ్రమర

జాలువారినమాట సత్య మౌను: తదాది
వల్లభుం డనుదినము వచ్చుచుండెడివాడు
వీక్షణోత్సుకత మావీధి మందపునడల.

సకియరో, ఒకనాటి సందె చీకటివేళ
ద్వారభూమి నొకింత దాటిపోయినవాడు
నను గాంచి వెనుదిరిగి నాలుగడుగులు వేసె.

ధైర్యమ్ము పూని నే ద్వారసీమను జేర
అడిగె నానేమన్ను వమ్మృత వాక్కులతోడ.

పట్టనమ్మును విడిచి పయనించు సమయమ్ము
దరియుచుండగ, నాకు తత్తరమ్ము జనించె.
ఉత్కంఠతో వేచి యుంటి దేహాళిమీద
వల్లభాగమనంబు వాంఛించి యొకనాడు.

నా యదృష్టవశాన నాటిరాతిరివేళ
దీపావళీకాంతి దృగ్గోచరు డైన
నాథుండు మెల్లగా నాసమీపమున జేరు
క్షణమునందే యెట్లొ గడపవెనుక బోయి
నిర్నిమేషమ్ముగా పిలువంబడితి నేను.

నా మోము వీక్షించి నాథు డించుక యాగి
సరణినే మృదువుగా సాగిపోవుచు నుండె.

గుండె దడదడ గొట్టుగొనుచున్న నెట్టులో
తెమలించుకొని గొంతు. తెచ్చికోల్ ధైర్యాన
మందమ్ముగా రేపు మాప్రయాణం బంటి.

నాథుండు తోడనే నను జేరి చల్లగా
అప్పుడే పోదువా అయ్యో అని నిట్టూర్చి
మన సమాగమ మెప్పుడు మరల అని ప్రశ్నించె.

## శాంత

మంచిమాట! ముందు నీవు
మాటలాడ కుందువేని
వెడలిపోవువాడె యతడు:
వియోగంబు తప్పనిదే!

## భ్రమర

తెరపు వడియె నో రెటులో
దేవికరుణ! కాని తగిన
బదులు పలుక జాలనైతి
ప్రాణేశ్వరుతోడ చెలీ!

ఏమొ తెలియ దంటి: పాప
మింత మొగము చేసికొన్న
నాధు డనియె మందముగా
నలుదిక్కులు చూచి యిట్లు:

"ఇంతటితో సరియేనా!
ఎన్నెన్నో ఆశ లున్న,
వంగణమ్ములోనికి నే
నరుదెంతున మాటాడగ!"

వదినయులికి ఏయిసంకనె
వల దంటిని లోని కతను.
పాపి మెంత మనసులోన
బాధ పడెనొ హృదయేశుడు!

“అటు లగునెడ నీవేమ
మ్మప్పుడపుడు వ్రాయుదువా?
పంపుదువా నీఛాయా
పటము చూచుకొనుచుందు!”

మౌనము వహియించితి నీ
మాటల కే మనకొనెనో
హృదయేశుడు ప్రాణసఖీ!
ఎంత మందబుద్ధి నయితి!

ఇంతలోన కంఠరవం
బీతేరగ, ప్రియుడు నన్ను
విడువలేక విడువలేక
వెడలి పోవపోగ సఖీ!

అనువదమ్ము వెను దిరుగుచు
అశ్రుక్రాంతవిశాలము
లగు లోచనములు నాపై
అనురాగముతో నిరవెను.

నిలిచి ద్వారదేశమందె
నిర్నిమేష నయనమ్ముల
జూచుచుంటి ప్రాణేశుని
చూపుమేరదాక సఖీ!

దివ్యపురుషభంగి దోచె
దీపికావళీవిరాజ
మానమూర్తి హృదయేశుడు
మార్గములో ప్రాణసఖీ!

పండుకొంటి లోని కరిగి
పర్యంకముపై, నూతన
వేదనతో ఆయామిని
వేగిపోయె ప్రాణసఖీ!

తెలియ లేదు ప్రియునివార్త
తీర్పలేదు ప్రియునికోర్కె
లోచదాయె ఉచితక్రియ,
ఓరదృష్టము, దురదృష్టము!

శాంత

అయినదానికి ఇంత ఆయాసపడ నేల?
చన్నవాడులే ముందు శాంతించు ప్రియసఖీ!

భ్రమర

నాప్రవర్తనవలన నాధుండు ననుఁగూర్చి
గ్రామీణగా నెంచునా ప్రియసఖీ.
కఠినహృదయగ నెంచునా?

నేటివరకును నేను నిష్క్రియమ్ముగ నుంట
విసిగి వేసరియుండునా? ప్రియసఖీ.
విస్మరించున నాధుఁడు?

శాంత

గ్రహించినాడు నీగాఢానురాగమ్ము.
మౌన మంగీకారమావనమ్ముగ నెంచి
ఉత్సుకుండై వేచి యున్నాఁడు నీకొఱకు.
చపలచిత్తుఁడు కాఁడు. శాంతస్వభావుండు.
మరవ డెన్నఁడు: నీకె మారునేమో మనసు.

భ్రమర

(ఆవేశముతో)

ఏటిమాట ప్రాణసఖీ!
ఎట్లు మరతు హృదయనాథు!
మారునేవి మానసంబు
మనుగడయే లేదు నాకు!

ఆత్మార్పణకయి యెంతో
ఆతురపడుచున్నదాన.
వెర్రిభయము మాత్రి మొకటి
విడువకున్న దేమి చేతు?

నాయందే గుణగణంబు
నాధున కాకర్షకంబు?
నడలకుండు టెట్లు ప్రేమ
శాశ్వతముగ ప్రియుని హృదిని?

## శాంత

ధీరహృదయగ ధీర రక్తి మ
తెలియ దీవల, కగాధమ్ముగ
వేరు తన్నినమహావృక్షము
విధమునన్ సకియా!

పొలపొంగువిధాన నాతడు
పైకి నుఱుకుట లేదు గానీ
విశ్వవణాలను.నిన్ను చెలియా,
వేయి జన్మలకున్!

## భ్రమర

యాదృచ్ఛికమ్ముగా నరుగుదెంచి మదీయ
శకటాధిరోహణక్షణములో వల్లభుడు
కాంచినాడే నన్ను గంభీరవదనుడై.

హావభావాంకిత యున్న, మందమందాక్షముగ
చూపుచున్నా వేంటి.—పూర్ణానురాగమ్ము
తొలుకాడు నేత్రాలతో ప్రియుని వను గాంచి
శిరసు వంకించి యేవో చెప్పబోయెను గాని
బంగారునోట ఏపలుకు రానేలేదు!

వన్నె తరిగిన జాలివదనమ్ముతో నాథు
డుగు ముందుకు వేసె—అశ్వమ్ము సాగినది :
వీక్షణపరిణముతో వీక్షించి యొకమారు
అల్లనల్లన నాథు డంతర్హితుం డయ్యె.

శాంత

ఇంతకన్న నిదర్శనం బిక
నేమి కావలె నోసి, నీప్రియు
గాఢరాగ వ్యంజకమ్ముగ ?
కంప మెందుల కే!

ఆత్మవిశ్వాసమ్ము కోల్పడి
వట్టి బిన్నా వోసి యబలా,
భవద మోఘ మహార్ఘ రూప
ప్రాభవము మరచి!

అంతరం బను చింత యుండునె
అమలినం బగు ప్రేమలహరికి

కులము, సంపద, లోకవృత్తియు
కూడ తాళవు పో !

ఆమహాగ్నిజ్వాలలో బడి
అన్నియును దగ్ధమయించి చెలియా,
దివ్యనూతన రూపరేఖల
దేజరిల్లు గదే !

ప్రి య ద

అర్పించుకొందు, న న్నమకంపతో మీరు
స్వీకరింపగ వలయు జీవితేశా! యనుచు
వంపుదును లేఖ యన, పదకర్త యైనట్టి
ప్రాణనాథునకు నాపలుకులో మాధుర్య
మెట్లు చాలును సఖీ, ఏమి చేయుదు విభుడు !

శా ం త

( ఆలోచనా పూర్వకముగా )

మరల నీ వాపురికి జని నీ
మనోహరుని జూచి రా దగు –
నొక్కసారి : వహింపవలె నీ
వోర్మి యందాకన్.

ఆ త్రిలోచనమూర్తి నీనయ
నామృతోర్మిల దేలియాడుచు
చెలియ. నీపదపట్టభంగ
శ్రేణి జేరును తే :

ప్రమదమున నీ ప్రాణనాధుని
బాహులతికలు నీతనూలత
నల్లిబిల్లిగ నల్లుకొను లే
అచిరకాలములో :

( భ్రమర మందహాసముతో తల
వాల్చును. ఉభయులును గాఢ
ముగా గౌగిలించుకొందురు )

# ఉత్తర భాగము

(సాయం సమయము. ధవళ పర్వత గృహములో విష్టకముల మీద ఇద్దరుపవేశించి యుందురు)

## ధూర్జటి

నిజమె సఖా, ప్రేమ యుభయ
నిష్ఠమైన దగును సఖా!
అవల నేమి సంఘటిల్లె
నాలకింపవలతు సఖా!

## త్రిలోచనుడు

మరుదినమ్ము పాణేశ్వరి
మాగృహాంగణమ్ము జేరి
భామినీజనమ్ముతోడ
భాషించుచునుండ గంట-

ద్వారసీమ నిలుచునన్ను
వామలోచనములతోడ
నిపుణముగా నడుమ నడుమ
పొందురక్తి జూడ జొచ్చె.

ఎంతవింతకాంతి నీను
హృదయేశ్వరిఁ జిమ్మిదోయి !
ఒక కటాక్షమునకె నేను
ఉప్పరమున తెగనిపోదు.

వీడుకోలువేళ సెలపు
వేడి చనెడితలపుతోడ
కాఱియావనమ్ము చేయ
గడగె నోయి ప్రాణప్రియ !

ఏమొ పలుకబోయె గాని
ఎదుట ముదిత లుండుకతన
జాలి గొలుపువదనముతో
పారించిన దోయి దృష్టి.

గాటముగా నపుడు ప్రియను
కౌగిలించుకొనెడి తమక
ముదయించెను: మెల్లన ని
ట్టూరుపుతో లోని కేగి-

సంభ్రమమ్ము పూర్ణముగా
శాంతించినపిదప మరల
దరిసివాడ నోయి సఖా,
ద్వారబంధవికటభూమి.

పిల్లగా మదీయనయన
చకోరమ్ము లానసాగె
సఖీపూర్ణవికచవదన
చంద్రికాజాల మపుడు.

పైటచెరగులోన మరుగు
పరచి తెచ్చినట్టితోచె
ప్రాణప్రియ తనఛాయా
పటము నాకు నొసగ సఖా!

అవకాశమె లేకపోయె
అందుకొనగ ప్రాణేశ్వరి
హస్తజలజయుగమునుండి
ఆయనర్ఘ బహుమానము.

చివర కెటులొ హృదయేశ్వరి
' సెలవు పోయి వత్తు ' ననగ
మందహాసవదనుడనై
మంచిది శుభ మంటి సఖా!

ధూర్జటి

అనల సఖా, నీప్రేయసి
అభిజనమ్ము ప్రాపించుచు
ప్రణయలేఖ వ్రాసినదా?
పంపినదా చిత్రపటము?

లేదు సఖా, నాకు తెలియ
లేదు సఖా. ప్రాణేశ్వరి
వార్త లేమికూడ సఖా !
వాడిపోయినాను సఖా !

ఉషాంశపక్ష మైనపెదవ
ప్రాణసఖీముఖ సుధాంశు
మండలమ్ము తోచె నొక్క-
మారు హఠాత్సంభవముగ.

నన్ను గాంచి విప్పారిన
నయనాంబురుహమ్ములతో
చేసె నమృతసేచనమ్ము
చిగురు దొడుగ నెడద సఖా !

ఆవలోకన క్షణమ్ము
నందు సఖా. హృదయేశ్వరి
భ్రూవల్లులు ధనురాకృతి
చూపిన నతిచిత్రముగా.

చిత్రరత్నకంబళా
పీన శైవభ్రమరికా
లలితముఖాంభోరుహమ్ము
లజ్జచే వాలిపోయె.

ఆమె యంతికమున కే
నల్ల నల్ల పోవుచున్
పల్కరింపగా మధుర
భాషణములతో ప్రియన్.

«ఏమి ప్రియా, నీకు నై
ఎదురు చూచుచున్నాను
దినము దినము, వార్తయే
తెలియునే తెలియు లేదు.

«కుశలమా? ఇచట నీవు
కొన్నిరోజు లుందువా?
మనము రహస్యమ్ముగా,
మాటలాడు కొందమా?»

«వీలు కానరా దిచట,
వెడలి పోవుచున్నాను
శీఘ్రముగా మాయాడు-
చెప్పలేను క్షేమ మని?»

అన్న దోయి ప్రియురాలు.—
అంతలో నెవరొ యచట
కరుగుదేర, మరలినా
నన్య కక్ష్యలోవలకు.

పోష్రచుండ బంగారు
బొమ్మ నడుమ నడుమ నా
వదన మీక్షించుచుండె
వాలుచూడ్కి పారించి.

మరల నే బలుకరింప
మందహాస చంద్రికా
మంజులాసనము వాల్చి
మారు పలుక లే దోయి !

నాలుగ్గైదడుగు లేమ
నడువగా వెనుకదిక్కు
వివంబడెను తలు పోర
వేసినట్లు మందనుగ.

ధూర్జటి

పరుల చూతు రేమొ యనెడి
భయముచేత వీ ప్రియుప
అవిధాన వర్తించిన,
దమరాగము లేక కాదు.

## తిరోధానము

అవును సఖా, నిజమె సఖా,
ఆర్ద్ర హృదయురాలు సఖా,
శాంతమూర్తి హృదయేశ్వరి
జాగరూకురాలు సఖా!

అపుడు నేను కౌతుకమ్ము
నణచుకొనుచు పురోవర్తి
కక్ష్యలోన ప్రవేశించి
కవాటమ్ము తెరచి యుంచి-

శయ్యమీద పవ్వళించి,
శాంతముగా జూచుచుంటి
ప్రాణేశ్వరి యున్నవైపు
బాహుయుగళి మల్లెవేసి.

కిటకియు ఏనోవు రెండు
గడియ లావిధాన, తిరిమర
తుదకు ద్వార మోర చేసి
తొంగి చూచె నోయి సఖా!

ప్రాణేశ్వరిం గాంచు ప్రథమ క్షణమునందు
నాట్యమ్ము చేసినది నయనద్వయ మొకింత,
తెలియకుండనె లేచితిని శయ్యపైనుండి.

బంగారంపు మెరుంగు వన్నె కౌశేయంబు
ధరియించి నీలాలకలకు రైకను తొడిగి.
కంఠప్రదేశాన కనకహారశ్రేణి
వింత జిలుగులతోడ వ్రేలాడుచుండగా
దరహాస చంద్రికా ధవళితాస్యముతోడ
చూచె నోయి సువర్ణ సుందరీ సంకాశ!

నిటల భాగముమీది నీలకుంకుమతిలకి
బిందు వజ్రమ్ముపై భృంగమట్లు చెలంగె.

అప్రియత్నమ్ముగా ఆయిదా రడుగు లేసి
దీర్ఘ బాహాలు చాపితివి ప్రియాతమవృత్తె.

వజ్రలోలక యుగ్మవల్గనమ్మున చెలియ
విద్దంపు చెక్కుటద్దాల నిచిడీకృతం బైన
మెరుగు జిగజిగ తమల్ మిరుమిట్లు గొల్పినది.

అంత కంఠకు తదీయాంతికమ్మునకు నే
జేరుచుండగ భ్రమర సిగ్గుచూపులతోడ
మస్తకమ్మును వాల్చి మరలె పార్శ్వమ్మునకు.

ఏమి చెప్పుదు సఖా, ఇంద్రనీల ప్రభల
వేణికాజాలమ్ము వింతవింతగ గూర్చి
చుట్టుకొన్నది మల్లెపూవ ప్రజము చెలియ.

దేవలోకమునుండి దిగిన కామినీ వోలె
కాంతు లీనిన దోయి గదిలోన ప్రియురాలు!

పృథు వైనదోయి నాప్రియురాలి కమదోయి
తగు వైనదోయి నాప్రియురాలి చనుదోయి!

( ధూర్జటి చప్పట్లు చరచును )

ప్రాణేశ్వరి యెటో పయనమువేళన్
అటుగుడెంచి నాయంతికమునకున్
చేతులు శోధించినది పోదు నని.

అంగుళీయకము లాలోకించుచు
అంటిని సఖుడా ఆందోళనలో:
" ఈహృదయమతి రెరిగినదే కద
నీ కిదె నిక్కపునెల వని యెంచుము ?

మూగచూపులో ముద్దుగుమ్మ చనె:
మాటిమాటికిని మంగళవిగ్రహ
ముదయించును నాయూహాలయమున !

ధూర్జటి

కొనియాడ వేమి తద్గుణగణమ్ములను సఖా.
స్మరియించుచున్నావు సుందరాకారంటె.

పరకీయ యామె యని భావింపకున్నావు-
అరుదేర నామె నీ కప్రతిష్ఠ పుటిల్లు.

బంధువర్గము కల్గుబాప్రహ్మణుండవు నీవు
ధర్మపరికారమ్ము తగుకన్నె బెండ్లాడి
వాంఛింప కాత్మీయవంశాభివృద్ధిః యీ
వకప్రిమార్గమునందు వర్తింతువా పఖాః

త్రిలోచనుడు

( ఆలోచించి )

నీవాక్యమ్ములు నిజమే యయినను
వరించు వనితమ వర్జింతుమయా ః
భావికాలమున బంగరుబొమ్మకు
లేశము సౌఖ్యము లేనే లేదా ః

ధూర్జటి

పరకీయకునై బాధపడుదువా
నిజహిత మేమో నిర్వహింపవా ః

త్రిలోచనుడు

ఆమెకు నాపై నమరాగము తే
దని గ్రహించుచో వేషుడు శమింతువా.

ధూర్జటి

(మందహాసము చేసి)

తాను తలచినది త్రైలోక్యసుందర
తాను మునిగినది దైవతనిమ్నగ ।

ఈ ప్రేమలు నే నెరిగినవే గద,
ఇవి శాశ్వత మని యెన్నడు నమ్మను.

బాధ యయిన నీభ్రమరిత నెటులో
మరచిపోవుటయె మంగళ మగు నిక ।

త్రిలోచనుడు

మరచు టెట్టులు దివ్యమంగళాకారంబు
సౌందర్యసారంపు సముదాయసదనంబు
త్రిజగతీలావణ్య తీర్థప్రదేశమ్ము
అత్యంతికిశోర యౌవనామృతపాత్రి
అఖిలరోచిఃపుంజ హారిమణిదర్పణము
ప్రద్యుమ్నశాణిత ప్రసవనారాచమ్ము.

ధూర్జటి

పరకర్త వైననీప్రజ్ఞ విశదం బాయె.
ఉద్రేకము త్యజించి ఉజ్జగింపుము యువతిః

అనురాగ మనురాగ మవి తపించెడి వేళ :
అధునికబాధలకు నదియె మూలం బోయి!

త్రిలోచనుడు

( కొంతతడ వాలోచించి )

శాంతం శివ మద్వైతమ్!
సత్యముగా వీఱతనము
ఎన్నటికిని చేయ నోయి
ఈమె సమాగమముకొరకు.

అనురాగము లేనిచట్ల
అవదనోలె కుమిలి కుమిలి
తపియించెడివాడ ననుచు
తలపబోకు ప్రాణసఖా!

సకల ముజ్జగించి తిరిమర
సాహసించి వచ్చునేని
స్వీకరింప దగున్నా తగదా
చెప్పు [illegible] ప్రాణసఖా!

ధూ ర్జ టి

సంఘటిల్లిన యేని సత్యమ్ముగా అట్టి
ఉత్పాతమే. అపుడు యోజింపవచ్చునే.

త్రి లో చ ను డు

వడగల్లుదు నే బాధలు పఖుడా,
భరింపజాలను పరపీడనమును.
భ్రమరకు తూష్ణీంభావము కలిగిన
అవివేకిని కా సంగలాప్పుటకు ;

రక్తి లేవియెడ రసికుం డగు వా
పొగులాడ నొకొ యువతి కోసమై.

ధూ ర్జ టి

నీ ప్రతిజ్ఞనయి నిలిచి యుందు నని
భావించెద నిక పరమహర్షమున.

( ఇంతలో గంట వినబడును. త్రిలోచనుడు మెట్లు దిగి లేఖ అందుకొని వచ్చి, చదువుకొని ధూర్జటి చేతి కిచ్చును. అతడు బిగ్గరగా లేఖ చదువును.)

" జగతిలో నాకన్న సంశయాపన్న
తలవాడు మెలగునే యెవ్వతె యైన;

పరిణయావస్థయే బాధాకరంబు
పరిష్కృత స్థితియుగూడ భయదరూపంబు

అంధకారమునందు అల్లాడుచుండ
కావంబడియె దీపకళికార్చి నాకు.

హృదయంబు ద్రవియింప నిచ్చ ·ంచితిని
అద్దాని దీప్తినే అనుసరింపంగ

తలపోసి ధైర్యమ్ము పూను
వేళకు సమముగా వీవగా ఔచ్చె
సంశయావిలం, మంత సాధ్వసం బొదవె.

అత్తవారింటి కే ఏపగుట కల్ల ;
ప్రియుని జేరగ నేదొ భీతి జనించు.

నవనీత హృదయుంకు నా మనోహరుకు
నా ప్రివర్తనమున నవయునో యేమొ.

వాలితి తత్పాదవనజయుగ్మమున
అబలను కరుణతో నాశీర్వదింప.

ఆపాదపద్మాలె అవలంబనమ్ము
అగుగాక యాదీనురాలి కెల్లపుడు,"

నీ వన్నట్టులు నిక్కముగానే
యోగ్యురాలె యీ యువతీరత్నము.

ఉభయులకును శ్రీమ మొదవకుండగనే
తెలివితోడ విడదీసెను గ్రంథివి.

ఏ మందువు నీ విపు డీతరుణివి?
స్థైర్యము కల్గిన సరసమతివి సఖ!

## త్రి లో చ ను డు

స్ఫటికం బీహృదయం బౌ
సఖుడా, నీ కవగతమే.
పవిధవస్తువర్ణం బిట
జాయమాన మగుచునుండు.

ఈ చాతుర్మాస్య వ్రత
మెంత సుఖద మైన దోయి!
భావలోక విహారణమున
పరిపూర్ణత గాంచినాను.

జీవన గ్రీష్మర్తువులో
శీతలంపు సుధావ్రిపవు

దరిపినట్టి మధురస్మృతి
తరంగితం బగుచు నుండు.

నేను వలచినట్టి చెలికి
నిత్య మంగళమ్ము ! నాకు
పొంది శివానుగ్రహమున
శాంతి శ్శాంతి శ్శాంతిః !

1938-39

సమాప్తము